శ్రీరస్తు.

శ్రీలక్ష్మీనృసింహస్వామినేనమః.

ప్రాతమంగళగిరి రిజిష్టర్డుస్కూలు హెడ్డుమేష్టరగు

గంజి నాగయ్యగారి సహాయముచే

నారాయణవనపురనివాసులగు బ్రహ్మశ్రీ వాధూల నరసింహాచార్య ప్రియశిష్యుండగు

పడిగరాజు పురాణం కేశవదాసుచే రచియింపబడిన

# భక్తమనోరంజన కీర్తనలు.

ఇయ్యవి

గుంటూరుజిల్లా ప్రాతమంగళగిరిపురవాస్తవ్యుడగు

శ్రీమాన్ మొనిగంట్ల పేరయ్యగారి ద్రవ్యసహాయమున

బెజవాడ వాణీ ముద్రాక్షరశాలయందు

బి. కే. స్వామిచే ముద్రింపబడియె.

1914.



శ్రీరస్తు.

శ్రీమతే రామానుజాయనమః.

# భక్తమనోరంజనకీర్తనలు.

శ్లో॥ ఇందీవరదళశ్యామ । మిందిరానందకందళం
వందారుజనమందారం । వందేహం యదునందనం॥

శ్లో॥ మార్కండేయమహాధ్వరానలభవో వందారుచింతామణిః
మందారప్రసవైః ప్రతిక్షణమసౌ బృందారకైరర్చితః
చండాంశోస్సుతయాతయాసవిహార న్కుర్యాత్సదామంగళం
యుష్మాకంననుభావనామునివర స్సర్వంసహామండలే॥

శా॥ శ్రీమన్మంగళభూమిభృత్పురగృహస్థేము లక్ష్మైశ్వర్యను
త్రాము ల్భావనమానినందనులు ధీరాగ్రేసరు ల్భార్గవుల్
శ్రీమాంభోజదళాక్షు భక్తులు యశఃప్రీతు ల్బిడాజాష్టది
గ్ధామామర్త్యప్రముఖ్యవస్త్రుదులు మార్కండేయగోత్రోద్భవుల్॥

వ॥ యిట్లు ప్రకాశించుచుండిరి. వీరిలో పెద్దలగువారెవ్వరనిన.

సీసమాలిక.

తిరువీధులాన్వయాంబురుహభాస్కరుడన నలరుశ్రీమాన్బాపనయ్యశ్రేష్ఠి
సతతసత్యాచారసంపన్నశేఖరుం డనఘుహ కాంగ్రమ యమరయ్యశ్రేష్ఠి
అమలకాంగాబత్తులాన్వయతిలకుడు విశిష్టబంగారయ్యశ్రేష్ఠిమరియు
భూసురాశీర్వాదభూషణభూషితుం డనఘుబత్రాలక్ష్మణయ్యశ్రేష్ఠి
సాధుజనాహ్లాది సకలకార్యోపాది యగుమునగాల నాగయ్యశ్రేష్ఠి
అఖిలసద్విధివేది యతులబత్రావంశ సంజనితుండు కృష్ణయ్యశ్రేష్ఠి

వ్రాట్లవంశోద్భూతు ంరుబుద్ధిమంతుండులలితసుబ్బారాయులయ్యశ్రేష్టి
తుమ్మామహాన్వవా ంమ్మునజనియించి చెలువమొందినబుచ్చయ్యశ్రేష్టి
పంచలాన్వయజాతు ంచితుండై యొప్పు నరయు వేంకటరెడ్డెయ్యశ్రేష్టి
కవిరాజయాచకగణచకోరాళికి రాజు బిట్రాపకీరయ్యశ్రేష్టి
ఆశ్రితజనచాతకావళిపర్జన్యు డనగా త్రైపానకోలయ్యశ్రేష్టి
ఆదిగాగలవీరియాజ్ఞ గైకొని నేను ప్రహ్లాదనారదఫల్గునాది

గీ॥ సకలసజ్జననికురంబ ప్రకటములను । కృష్ణదివ్యాంఘ్రి పద్మసంకీర్తనముల । భక్తిదళుకొత్త జన్మసాఫల్య మొదవ । సరసతను జేయ నూహించు సమయమునను॥

వ॥ యీగ్రంథకర్త వంశావతారము.

ఉ॥ శ్రీకరపద్మశాలికులసింధుకళానిధియై విశాలను
శ్లోకదిగంతుడ యైను విశుద్ధుడునై యెనిగండ్లవంశమున్

భూకలితంబు జేయ హితవర్గదయాళుడు సత్యవతీ లో
కైకచరిత్రుడై వెలసె క్ష్మావలయంబున పాపయాఖ్యుడున్।

క॥ ఛాయారమణుడుముదమున। ఛాయాదేవినివరించు చందము
నన్ స్వ। చ్ఛాయాపహసితచాయున్। ఛాయాంబ వరించె వేదసమ్మతి
నతడున్॥

క॥ ఆపాపయగాంచెను ఛా। యాపంక్తిజాతియందు నభినవు స్వ
కులోద్దీపకు గనకాఖ్యునిశ్రిత। గోపనుసదసద్వివేకి గురుజనవినయున్॥

క॥ తిరువెంగడాంబయాతని। వరకులసతితదుపచార వర్తినియై
మున్। గిరిజాదేవిగిరీశుని। కరణిన్పూజించు సత్త్రికరిణియునగుచున్॥

క॥ తిరువెంగడాంబసత్పుతు। కరమర్థించియును జేసె కఠినవ్రతము
లన్ పరమేశ్వరార్పణములుగ। తరుణీమణులెల్లనద్భుతంబును జెందన్॥



సీ॥ అంతటపూర్వక్షీరాంభోధినుదయించు పార్వణైణాంకుని ప్రభ రహింప
కోసలరాట్కన్య కోదరావిర్భూత శ్రీరామచంద్రుని చెలువమమర
నుగ్రసేనాత్మ సముద్భూతగర్భావతారుడానరకాసు రారికివి
దాక్షాయణీదేవి కుక్షిసంజాతుడౌ పాకాసురాంతక ప్రతిభవరల

గీ॥ సరసయెనిగండ్లవంశవిస్తారికనక । యాఖ్యునకు సాధ్వి తిరు
వెంగడాంబయందు । ననృతభీరువుపుట్టె వీరయ్య విద్వ । దంబుజాతావ
ళికి మార్తాండుడయ్యె॥

వ॥ అంత నొకసమయంబున.

ఉ॥ శ్రీయెనిగండ్లవంగసప్రసిద్ధపయోనిధి యావిర్మాను శ్రీ
బాయి సువర్ణవస్త్రపరిధాయి పదంబుజధ్యాయి సర్వదా
న్యాయి మహాద్విధేయి కనకాఖ్యతనూభవ శ్రేష్ఠుడు న్కమా
రాయితశక్తిశాలి సుగుణావళి వీరయసన్మనస్కుడై॥

గీ॥ వరపురాణాన్వవాయ సంభవునినన్ను । కొండనామతనూజుని గురువిధేయు । కృష్ణపాదాబ్జచింతను కేశవాఖ్యు । నరసిమృదుమధురోక్తి నిట్లనియె బ్రీతి॥

క॥ పరములుభవసాగరసం। తరములుసామ్రాజ్యపూజ్యతనయాదిదముల్ । చిరములుభవ్యయశోవి। స్తరములు హరిదివ్యనామ సంకీర్తనముల్॥

మ॥ కనుకన్నామకనామమంత్యమునరాగా గొన్ని సంకీర్తనల్
దనుజారాతిని దేవరాడవరజు న్ధర్మస్వరూపిన్రమా
వనితాహృత్కమలాంబుజప్రియుని శ్రీవత్సాంకితున్మంగళా
వనిభృన్మందిరుగూర్చి జేయు కైవల్యంబునీకబ్బెడిన్॥

క॥ అనవినిసంతోషించి పనిబూనితినంత గంజివంశక్షీరాం। బునిధి హిమాంశుడు తల్చ। నాగరి ర్యబ్రహ్మజ్ఞుండున్॥

క॥ వరబిట్రానంశాంబుధి। పరువపుచంద్రుండు సత్యభాషణరతు
డుగా। సరసోత్తముండు వేంకట।నరసింహాఖ్యుండుసద్గుణావళియుతుడుగా॥

క॥ పంచలసంశాంభోభూ। చంచనార్యాండుడై ప్రశస్తుండై శ్రీ।
కాంచనవస్త్రాంఘ్రియుగ్మ। దంచితుడైసట్టి కోటయాఖ్యోత్తముడుగా॥

వ॥ వీరిని సహాయులుగా గైకొని.

గీ॥ ధరణి తెలగవంశ వరవిభూషణుడయి। వెలయు కాళహస్తి
వేంకటప్ప। యాఖ్య ఁకీర్తనావళి ప్రకటీక। రించుచుండెసభల నం
చితముగ॥

వ॥ దీనియందు.

గీ॥ నేరములుగల్గెనేనియునూరివరులు। వాని సవరించి గైకొన

వలయునంచు । విన్నపము జేయువాడ కవీంద్రులార । పానకము నలు
సులున్నను బాయదగునె॥

వ॥ యిట్లు భవద్విధేయుడు పురాణం కేశవదాసు.

శ్రీరస్తు.

శ్రీమతేరామానుజాయనమః.

# భక్తమనోరంజనకీర్తనలు.

శ్లో॥ గోధూళిధూసరితకోమలకుంతలాగ్రం। గోవర్ధనోద్ధరణకేళికృతప్రయాసం। గోపీజనస్తనకుచకుంకుమ ముద్రితాంగం। గోవిందమిందువదనం శరణంభజామః॥

ఉ॥ శ్రీరమణీవరుండు సరసీజదళాక్షుడు నారసింహుడై
భూరిభయంకరుండగుట ప్రోస్తుతిపన్నగశాయిభక్తులన్
జేరగదీసి గోపనముజేయుదుగాక నటంచునిప్డు శృం
గారము మంగళాచల మగారముగాగల స్వామిబ్రోవుతన్॥

ఉ॥ గౌరిష।హిమోన్నతంబయిన క్ష్మాధరవాసము జేయునంచు తా
గోరివచింప శ్రీధరుడు గోత్రకులోత్తమ మంగళాద్రిసం
చారనివాసముల్సలుప సంతసమొందినలోకపోషణీ
శ్రీరమణీలలామ సవిశేషములన్నొసగు న్శుభంబులన్॥

చ॥ జనకునికంఠభూషణ భుజంగమస్వామిని పద్మనాళభ్రాం
తిని నిజదీర్ఘతుండమునసేద్వ స్వకీయతురంగమంబుభీ
తినినడరన్గనుంగొని మదిభ్రమజెందితినంచు వీడి వా -
హానమును నాదరించు గిరిజాత్మజుడీవుత మాకవిఘ్నముల్

ఉ॥ ప్రాణులసృష్టిజేయుతరి బ్రహ్మరసజ్ఞవసించి ప్రోథతన్
బూనగజేసి సర్వకవిపుంగవ జిహ్వానివాసినై తదీ
యానుపమానకావ్యముల నార్యులుమెచ్చ నొనర్చు సర్వవి
ద్యానిధి వాణి మద్వదనమారయగా వినుతించి మొక్కెదన్।

క॥ నిగమార్థవేదులను సాత్యాగులన్సమలోష్ట కాంచనాశ్మలవిల
సత్ఖగనాథవాహనార్చిత। స్వగృహార్ధప్రాణుల గురువరులదలంతున్॥

ఉ॥ ఆదులసంస్కృతాంధ్రకవితాబ్జ మిళిందులనాకుజాతపె
ద్దాదుల వర్తమానకవినాథుల సన్నుతిజేసి గీతవి
ద్యాధనుల న్సభాజనుల నందర నాత్మనుతించి శ్రీరమా
నాథపదాబ్జకీర్తనము నార్యులుమెచ్చ నొనర్పబూనితిన్॥

## 1. బేహాగ్-చాపు.

నాగావరానన నాగావిభూషణ-యోగీజనావనా- పాలాయా॥ మద॥నా॥
భక్తార్చితపదపంకేరుహాయుగ। భక్తిముక్తిపదపాలాయ-మద॥ నా॥
మంగళగిరిహరిసంగతనయశు-భాంగవినాయకపాలాయ-మద॥నా॥
క్రూరహామొనిగండ్ల-వీరయసేవిత-ఘోరకలుషహరపాలాయ-మద॥నా

## 2. సురట- రూపకము.

వీణాపుస్తకాక్షపద్మపాణివాణి। భ్రమరవేణి॥ వీ॥
మానినీమణినారసజ్జ- నుందిరవైయమృతోపమ। వాణులొసగు ప్రణా
మములో॥ వీ॥
రాజహంసగమనరాణి। రంజితనిర్జరభామిని। రాజవదనహారాసుజన॥ వీ॥
ధరణిమంగళాద్రివాస। దాసజనోత్తమ- వీరయ। దురితహారణి శుభో
ద్ధరణి॥ వీ॥

## 3. కాంభోజి- ఏక.

శ్రీరుక్మిణినాథగావరా- శ్రితలోకకల్ప॥ శ్రీ॥
సారసాక్షనిన్ను-కోరినానోకొన్ని మేరలేనితృష్ణ దూరాము జేయాగా॥
దిక్కులేని వారిదిక్కునీవై యుండ- చక్కనినాసామి సమయమిదే బ్రోవ॥
ధరణిమంగళాద్రిధామమెలిగండ్ల। వీరయాఖ్యనుత విబుధాళిసేవిత॥ శ్రీ॥

4. శంకరాభరణము-ఆది.

గోపాలబాలా నృపాలా- సత్యభామలోల॥
భూపారికాలకాదనీల- తాపాసజాల ప్రణుతశీల॥ గో॥
పరిమళమిళితవరవనసుమచయమ- యూరకనకపింఛచారుమాళిరీ-మురఫణివరగరుడమారసుందర- హరిన్నృపాలవాల యఘువిఘాల॥గో॥
జలరుహానయన- ఖలజలనిధబడబ- కాలహాసఖదేవనన్నుబ్రోవ-రీ। సలలితసమయమిదిమంగళాచల- నిలయవిరయాప్త- నిఖిలవ్యాప్త॥

5. శంకరాభరణము-ఆట.

అంభోజనాభాహారే కంసారే- అఖిలవేషధారే పాహీన్నృహారే అం॥
జంభారివందితా జనకజామాతా। శాంభానీదయుతా॥ రీరీరీయిరిఇఇరిఇరిఇఇఇ॥ అం॥
స్వామీభద్దాసా కామాప్రదేయా- రామారిఅనుజావన। కామార్చ్బదాసుదరామధుదమన- శ్రీమానినీరమణ॥ రీ॥ అం॥

మంగళగిరిపుర మందిరహరిమణి-భృంగాంగరఘుపుంగవా। సంగరహిత
పతంగరక్షక యఘభంగ వీరయ సన్నుత॥ రీ॥ అం॥

## 6. తరళవృత్తము.

వనరుహాంబకకోటిసుందరు వ్రజినందనపోషణుఁ। దినపజారమణున్నరాత్పరు దేవదేవునికృష్ణునిఁ। ఫణికులేశ్వరగర్వనిర్వహ ప్రౌఢభక్తి ముముక్షువుల్। ఘనులు శ్రీయెనిగండ్ల వీరయ కాంతు యిని గొల్తురా॥

## 7. హిందుస్తానితోడి-రూపకము.

సామినన్నుపుడాదరించెదో- సామోద్భూతము నేలినకామజనక॥ సా॥
యేమహాకారములోసర్చి- యేనుపాతకములనుగొంటి. దామోదరనీ। దా
సుడ- తామరసదళాక్షమును- తామసభూసురుపీడితే॥ సా॥

మంగళగిరినిలయఖగతు- రంగదయాపాంగదురిత- భంగావిరాఖ్యదాస।
బంగరుకుసుమార్చితనీ- లాంగభుజంగాధిపశయ॥ సా॥

## 8. భైరవి-ఏక.

పీలాచితినిరా- జనార్ధనా॥ పీ॥
ఆలమునగోపాలనరునకు- మేలుజేసినపాలకుడవని। చాలవగపాంచాలివే
డిన- చేలములిచ్చినజాలకుడీవాసి॥ పీ॥
శేషశయనా ఘోషరమణవి- భీషణునినిదోషియనిత। ద్వేషమును వి
ని రోషిగాక వి- శేషప్రియంబున పోషకుండవనిరా॥ పీ॥
చారుచరితా క్షీరనిధచర- నారదార్చిత వీరశేఖర। దాసివః ధీరమం
గళ- ధారుణీధరవీరయార్చితా॥ పీ॥

## 9. ఫీల్-చాపు.

సుందరాస్యా యిందుశేఖరా- నందితాసనాతనారామా।

యిందిరాదయి యేలూమంటి- సింధుతల్పగోవిందాసమ్మియుంటి॥ సు॥
నీమహిమకనజాలనంటి- స్వామినీకుమ్రొక్క వేచుకుంటి॥ సుం॥
మంగళశిఖరి నాయకాశ్రీ- రంగాయెనిగంగ్లాపీరయార్చిత॥ సుం॥

## 10. సావేరి-రూపకము.

సారమైనాచమవదేలా- దురితవనధనుంజయుని- మరువకనిరతము భజిం
చని॥ సా॥
ధరణిరతిసమానసుందరి హీన స్తనమైన- కరణి హరిని- స్వామిని- హరి
వచన నికరంబును ప్రకటించని॥ సా॥
కరము లేనిగంధాసిం- ధురరాజమాడ్కిని- వరశివగిరినాయకుపీ। రయ
శుభకు డెందము కరుగించని॥ సా॥

## 11. హిందుస్తాని కాఫీ-ఆది.

నారసింహశ్రీపతే పురారిశేవ్యతే॥ నమో నమో నమో నమో నమో

నమో నమో॥ నా॥

హేమనేత్రసోదరారి హామనోహరా। సా- మా- జా- నుం- గళప్రదా
యకా॥ నా॥

దానవేశబాలకప్రధానపాలకా। మా- నీ- ధ్యా- నా- ప్రియాతిదావనా॥

మంగళాద్రిమందిరా యనంగసుందరా। తుం- గా- గం- గా- తరంగ
చారణా॥ నా॥

తారహారశోభితా శ్రీ- వీరయార్చితా। ని-రా-కా-రా-విహారకేశవా॥ నా॥

## 12. కమలవిలసితవృత్తము.

హాయవరముఖసుర యమినుతనామున్ । స్మయపరిహారుహిత
మదనవిరామున్। వ్యయరహితునికరి వరదుని శ్రీపీ। రయప్రణుతుసిమన
మలగభజింతున్॥

## 13. సంత-ఆది.

కోపము జేసెదవిది మేరా- కృపఁ డవేరయతి॥ కో॥
గోపమిత్రరవిజాక- శత్రవసుదేవ పుత్రబహువి- చిత్రచరిత్ర॥ కో॥
మునురావణుతమ్ముని కృపపోషితుఫురా భళిరా- దినప తేజయనుమా
నముపీడితి రా- మునువి భీణుడు యేమియిచ్చేరా- మానసించి
కో కానుకగై కొన॥ కో॥
కనకాక్షునిసోదరతనయుం డేవె సగెన్- పోసగన్ - మసనురాయిజేసె
ను- కనికనకనురా- తి రాతిగయొనర్చితౌర- ధీనిధీశుభాద్రిపీర
యనుత॥ కో॥

## 14. భైరవి-రూపకము.

దశరథరాజకుమారా- దశము సురాజకుమారా। దిశ వేరాశూరా- దే
వా శ్రీగమునీరా॥ ద॥

తరుణహిమాంశులలాటా- వరఫణిభూషితమకుటా। హరిదామోదర
ప్రకటా- నరపతిసంయమినికటా॥ ద॥
కలుషసపత్నివిఘాలా- బలభుజకీర్తివిశాలా। బలిహితమంగళశైలా- ని
లయావీరయపాలా॥ ద॥

## 15. కాంభోజి-ఆది.

లీలావినోదాహారి- సన్నేలుము ప్రహ్లాదు పోలికన్నహారీ॥ లీ॥
జాలినిబొందితి నీళామనోరమణ। కాలారినున్మథ జాలీజిక్కించిన॥ లీ॥
హేమభూషణావిలాసా శ్రీమంగళాద్రి। భీమానుజావనవీరాఖ్యవందిత॥ లీ॥

## 16. బేహాగ్-జుల్వా.

యెన్నిభంగులా నాకన్నతండ్రిరా- నన్ను యనుచునిన్ను జేరి సన్నుతింతు
రా॥ యె॥

జాలమేలరా నిపాలబడితిరా- కాలకాలవినుతశీల యేలవేలరా॥ యె॥
యేమిసేతురా పిన్నటులజూతురా- నానోముఫలము యిట్టులుండ కామసుందరా॥ యె॥
ధరణిమంగళా గిరివరాలయా- కరుణతో యెనిగండ్లవీరయ కాంతులీవయా॥ యె॥

## 17. కన్నడ-ఆది.

దయరాదుగాహరీ- స్మయహారీ- మంగళగిరిశిఖరవిహారీ॥ ద॥
భయభక్తులనిను భజనజేసినను - భమనోధనహారీ। నయమున నీదరిజేరి గుణహారీ గోకులవిహారీ॥ ద॥
మురజతాళతంబురలనుగొని బా- లురదాసులగూడి గుమిగూడి। వరవస్త్రవ్రులనువీడి- నినుపాడినను మేలమోడి॥ ద॥
కన్నడ మొదలగురాగంబులనిను సన్నుతింప వినవటరా । కన్నడేలతగునటరా- బి వటరా వరనీర ...చర। ద

18. మత్తకోకిలవృత్తము.

మాటిమాటికి బాధ కేహరి- మానవోత్తములారమీ
కేటికిన్ భ్రమింపమాయ లయింప జేసిఖగాధిరాట్
ఘోటకుఁ వసుదేవనందను గొల్చిముక్తి వరింపరే
వాటమౌ యెనిగండ్లవీరయ- నాంఛ దాయినజస్రముఁ।

.19. హిందుస్తానిముఖారి-జల్వ.

మరువనయ్యా నాదైవమీవేనయ్యా- సరోజాక్షుయేమయ్యా॥ మ॥
హరీశౌరీదుగ్ధాంభోధీవిహారీ- ఆనందరత బాణారీ కైటభారీ। పురారీ సు
రానుసారీ- మరిమరి వేడితినృహరీ శౌకబరీ॥ మ॥
రమానావాసా పంకేజాస్యానివాసా- కళ్యాణచలనివేశా- స్వర్ణ-వాసా
ప్రభాసా సుమేషావాసా- యనుపమవిలాసా నుతవీరయదాసా॥

## 20. కన్నడ-చాపు.

రాయదునాథా రాఘితరాథా। కాయజసుందరా కారవినోదా॥ రా॥
నాయకునమ్మిన నాంచుకిపీడిన- చాయననన్నడ బాయుటయుక్తమె॥
భూపులకీలాటి బాంకులుగలవే- తాపసపాలన తరుణమిదె బ్రోవ॥ రా॥
మంగళగిరిపుర మంధిరయదుకుల- పుంగవవీరయ పోషణకరణ॥ రా॥

## 21. పరజు-ఏకతాళం.

విదురసన్నుతాబ్జనాభా- సాధుజాలములు సన్నుతించినిను సంతసింపలేదా। వేదవేద్యమహేశ్వరా సరోజాక్షు- సదమాత్మయనుచువేడినాడా॥ వి॥
మున్ను కర్దమునిభార్య గర్భమునయున్నదీవెకావా। నన్నగారితురంగమా నిన్నెనమ్మియుంటి నన్నుబ్రోవువేగ॥ వి॥

సత్యస ఢవంచుననమ్మితి- సవ్యసాచిమిత్రా। నిత్యవై భవమంగళాద్రి
వాసా- భృత్యునేలుము పీరయార్చిత। వి॥

## 22. దర్బారు-జుల్వ.

గరుడతురంగము- గళగిరినిలయున్ను- హరిని సేవింతామా। సఖా సఖా
హరిని దర్శింతామా॥ గ॥

సరసిజదళనేత్ర- సజలనీరదగాత్ర। పరిపాలయాయనగా- విని
యునువినని దొరవలె తానుండగా। బ్రహ్మాదినిర్జరులెల్లా ప్రార్థింపగా-
ప్రహ్లాదుడు హరిహరిపాహియనగా। మహోగ్రుండై సరగునను గం
బమునబుట్టియు- దురితుదితిసుతుజావగొట్టియు- పరమసాధునిగాచియా
శుభ గిరికి తావేంచేసినాడట॥ గ॥

ధరణికలియుగదాసా- వరులవుప్రజలుగొని- వరమివ్వనూహించి
ఫాల్గునశుద్ధ పరువమందునమించి- దివ్యంబైన యరదమారోహించి పం

చాపరి- కరము ధరియించి సుందరముతో- గరుడమారుతు లిరుకెలం
కుల- పరిచరిం భూసుతోత్తమ- వరులు వేదముజపము సేయక- నరుల
నేలను రాగలండట॥ గ॥

తరుణులు పురుషులు తమమనోవాంఛాల- పరిపూర్తులుగ జే
యగా- పానకముబంగరు ఘటములనిండుగా- యుంచియుస్వామి చర
ణాబ్జములవ్రాలగా- యర్ఘ్యపానమరుదుగా తాజేయగా- సంతోషించి
యు కరములనుజోడించి శేషముపరిగ్రహించియు ధన్యులగుదురు- సర
సవీరయదాసపోషణు- నరహరినిదర్శించబోదము॥ గ॥

## 23. సురట-ఆది.

మొగమైనాజూపవేరా- నీకుమొగతాళిగదోచెరా- నాగారత్న
కా భోగీంద్రశయనా- జాగేలరాయిక వేగమెరా- గోగరచిత
గాదిమార్చిత నా ...డెద సత్యవాక్యనిరత॥ మొ

యేమి శేతునే రామానుజ నేనీ సోమాననము జూపు దామోదర।
యేమో విభవమ్మున - కామించినానని। తామసింపకు శ్రీమనోరమణా॥
దిక్కునీవెనా చక్కనయ్యనీ. వెక్కడయుంటివో ప్రొక్కితిరా।
నిక్కముశుభగిరి నిలయా శ్రీవీరయ్య- మక్కువలివ్వని మ్రొక్కి వేడి
తిని॥ యే॥

## 24. కవిరాజవిరాజితవృత్తము.

జనకజకై నృపజాలములారయ- శంకరుచాపము చండగతిన్
ఘనభుజసత్వము గ్రాలగ జానకి కన్నులపండువగా సరయున్
జనకధరాపతిసంతసమందగ సామజమిత్రుపుచందమునన్
దునిమినవీరయ దోషనివారిని స్తోత్రము చేసెద శోరముగన్॥

## 25. బేహాగ్ - ఆది.

జయజయ జానకీ జానిమురారీ। జయజయ పాదజజహ్నుకుమారీ॥ జ॥

తరణిజతటవనతలసువిహారీ- పరినుతవాసవబ్రహ్మపురారీ॥ జ॥
సారథమంగళ శైలప్రచారీ- నీరయసేవిత వేంకటశౌరీ॥ జ॥

26. హిందుస్తానికాఫి-ఏక.

మంగాళంరాజపుంగవా దళితభుజంగపతంగతురంగరాఘవ॥ జయ మం।
సరసిజనేత్రని సురారిమురవిపక్షపారిజాతహార- పురహరమిత్రా నీరజా
నముల్ వారిజాక్షులివ్వ- ధీరా- యదువీరా- సుకుమారా- ద
ధిచోరా॥ జయమం॥
మునివరాతనయా మనోజాశతరూప- గానలోలధనాధిపాయనుజారీ। మ
నోరమశుభశ్రోణీభృద్వీరయ- ధ్యేయ- సనుపాయా। యదుదా
యా। జితమాయ॥ జయమంగళం॥

శ్లో॥ మంగళంనారసింహాయ । మంగళంభక్తపాలినే
మంగళాద్రినివేశాయ తుభ్యంభవతుమంగళం॥

శా। భారద్వాజుని విందుమానిసతి విప్రాఢ్యోజనంబున్ సశ్లో
దారామామణి స్తన్యమున్ విదురసోదాగాన్నమున్ గోపికా
నారీమంజుతరాధరామృతము శ్రీనారాయణా నీవుద్యో
కారుణ్యంబున గొంటివాకరణి మత్కావ్యంబు చేకొంగదే॥

క॥ దీనిన్ వ్రాసినవినిన్ । గానంబొనరించినన్ ఖగాంతస్థానుం
డైనవినాయకవాహను । డానందంబొసగు బుధుల కశ్రాంతంబున్॥

గద్య॥ ఇది శ్రీమత్సాకిస్సేనగోత్రపవిత్ర పడిగరాజాన్వయాంభోజ
మిత్ర పురాణం వేంకటదాసపౌత్ర కొండనామపుత్ర విద్వజ్జనా
రాధనార్జిత విద్యాప్రభాససతతసేవిత శ్రీనివాస కేశవదాస
ప్రణీతంబైన (భక్తమనోరంజని) యను హరినామ సం
కీర్తనములు సంపూర్ణము.

శ్రీకృష్ణార్పణమస్తు. స్వస్త్యస్తు.

శ్రీ శ్రీ శ్రీ శ్రీ శ్రీ శ్రీ శ్రీ శ్రీ శ్రీ శ్రీ శ్రీ

